Hindupad.com www.hindupad.com

# మార్గశీర్ష మహాలక్ష్మి వ్రత మహాత్మ్యం

## పూ జా వి ధా న ం

1. గృహాన్ని కడిగి పరిశుభ్రంగా చేసుకోవాలి.
2. ఇంటిలోని వారందరూ ఈపూజను జరుపుకోవాలని ఉత్సాహవంతులై వుండాలి.
3. వ్రత మాచరించే వారు పవిత్రమైన హృదయంతో వ్రతనియమాలను పాటించాలి. అనగా మధుపాన, మాంసాహారాదులను విడిచిపెట్టాలి.
4. ఈ వ్రతాన్ని మార్గశిరమాసమున వచ్చే మొదటి గురు వారం రోజు ప్రారంభించాలి. అలాగే అఖరి గురు వారం ఉద్యాపనచేయాలి.
5. పీటకి పసుపురాసి చుట్టూ ఎనిమిది బొట్లుపెట్టి మధ్యన అందంగా ముగ్గుపెట్టాలి. లక్ష్మీదేవి ఫోటో పెట్టి మధ్యన గుప్పెడు బియ్యం వేయాలి.
6. ఆ బియ్యంపై ఒక రాగిచెంబు పెట్టి అందులో నీళ్ళు పోసి చిటికెడు పసుపు కుంకుమ వేసి అందులో మంచి ముత్యం, పగడం, రాగిపైసా, పోకచెక్క, దర్భగడ్డి, బంగారం వేయాలి.
7. మీకు దగ్గరిలో దొరికేఫలము ఇచ్చే చెట్టు కొమ్మలు ఐదురకాల కొమ్మలు అనగా మామిడి జామ, సీతా ఫలం, నారింజ, పనస, కొమ్మలను రాగి చెంబులో నుంచవలెను.

8. ఒక కొబ్బరికాయకు పసుపురాసి బొట్టుపెట్టి రాగి చెంబు మధ్యలో నుంచవలెను.

9. లక్ష్మీదేవికి గురువారం ఉదయం సాయంత్రం శుక్ర వారం ఉదయం నేతిదీపారాధన చేయాలి.

10. గురువారం సాయం సమయాన పూజానంతరం కథ చదువుకొని గోమాతను పూజించి లక్ష్మీదేవికి నివేదించిన ప్రసాదాన్ని కొంచెం గోవుకు పెట్టి మిగిలినది సకుటుంబం తిన వలెను.

11. శ్రీ మహాలక్ష్మి వ్రతమాచరించువారు గురువారం ఉపవాస దీక్షలో వుండాలి. పాలు, పళ్ళు మాత్రమే తీసుకుని సాయంత్రం పూజానంతరం భోజనం చేయాలి. ఈవ్రత మాచరించు స్త్రీకి అటకం కలిగిన యడల వేరవరిచేతనయినా చేయించాలి గాని ఎట్టి పరిస్థితిలో ఆపరాదు.

12. మార్గశిరమాస గురువారం ఉదయం సాయంత్రం కథ చదువుకుని శుక్రవారం కూడా వ్రతకథ చదువుకొని కలశమును తీసి కొమ్మలను తీసి రాగిచెంబులోని మంచిముత్యం, పగడం బంగారు కొబ్బరికాయను తీసి జాగ్రత్తపెట్టి కొమ్మలను రాగిచెంబులోని నీటిని నదిలో కలపవలెను.

13. కొబ్బరికాయ, మంచిముత్యం, పగడం, బంగారం, బియ్యం మరునటి వారమునకు ఉపయోగించవలెను.

Hindupad.com www.hindupad.com

14. వ్రతమంతా పూర్తవగానే ముత్యం, పగడం, బంగారం భద్రపరచి కొబ్బరికాయ ఇంటికి రక్షగా కట్టవలెను. బియ్యంను పరమాన్నంవండి అందరూ తినవలెను.

## ఉద్యాపన

మార్గశిర మాస గురువారం ఆఖరివారం ఏడుగురు ముత్తయిదువులను లేదా ఏడుగురు కన్యలను గృహమునకు పిలిచి వారికి బొట్టుపెట్టి తాంబూలం ఇవ్వవలెను. వారికి తాంబూలం ఇస్తున్నప్పుడు ఆలక్ష్మీదేవిని మనస్ఫూర్తిగా తలుచుకోవాలి ఒక బ్రాహ్మ ణికి శక్తికొలది దక్షిణ ఇచ్చి వారి ఆశీర్వాదం పొందాలి.

## అథాష్టోత్తర శతనామపూజా

ప్రతినామానికి ముందు "ఓం" అనిచివర" నమః" అని చదవాలి.

| | |
|---|---|
| ఓం ప్రకృత్యై నమః | ఓం శ్రద్ధాయై నమః |
| వికృత్యై నమః | విభూత్యై |
| విద్యాయై | సురభ్యై |
| సర్వభూతహిత ప్రదాయై | పరమాత్మికాయై |

Hindupad.com www.hindupad.com

ఓం వాచే నమః
పద్మాలయాయై
పద్మాయై
శుచ్యై
స్వాహాయై
సుధాయై
ధన్యాయై
హిరణ్యాయై
లక్ష్మ్యై
నిత్యపుష్టాయై
విభావర్యై
అదిత్యై
దిత్యై, దీప్తాయై
రమాయై
వసుధారిణ్యై
కమలాయై
కాంతాయై
కామాక్ష్యై
క్రోధసంభవాయై
అనుగ్రహప్రదాయై
బుద్ధ్యై
అనఘాయై

ఓం హరివల్లభాయై నమః
అశోకాయై
అమృతాయై
దీపాయై
లోకవినాశిన్యై
ధర్మనిలయాయై
కరుణాలోకాయై
మాత్రే
పద్మప్రియాయై
పద్మవాసాయై
పద్మాక్ష్యై
పద్మ సుందర్యై
పద్మోద్భవాయై
పద్మముఖ్యై
పద్మనాభప్రియాయై
వరారోహాయై
దేవ్యై
పద్మిన్యై
పద్మగంధిన్యై
పుణ్యగంధాయై
సుప్రసన్నాయై
ప్రసాదాభిముఖ్యై

ఓం ప్రభాయై నమః
చంద్రవదనాయైనమః
చంద్రాయై
చన్ద్రసహోదర్యై
చతుర్భుజాయై
చంద్రరూపాయై
ఇందిరాయై
ఇందుశీతలాయై
ఆహ్లాదజనన్యై
పుష్ట్యై
శివాయై
శివకర్యై
రత్యై
విమలాయై
విశ్వజనన్యై
తుష్టయే
దారిద్ర్యనాశిన్యై
ప్రీతిపుష్కరిన్యై
శాంతాయై
శుక్లమాల్యాంబరాయై
శ్రియై
భాస్కర్యై

ఓం బిల్వనిల్వయాయై నమః
యశస్విన్యై
వసుంధరాయై
ఉదారాంగాయై
హరి [illegible]
హేమమాలిన్యై
ధనధాన్యనిన్యై
సిద్ధ్యయి
స్త్రైణసౌమ్యాయై
శుబవరాయై
నృపవేశ్మగతాయై
వరలక్ష్మ్యై
వసుప్రదాయై
శుభాయై
హిరణ్యప్రాకారాయై
సముద్రతనయాయై
జయాయై
మంగళాయై
దేవ్యై
విష్ణువక్షస్థలస్థితాయై
విష్ణుపత్న్యై
నారాయణసమాయై

ఓం త్రిలోకాయై నమః
దారిద్ర్య-ధ్వంసినిన్యై
దేవ్యై
సర్వోపద్రవనివారిణ్యై
నవదుర్గాయై
ఓం మహాకాళ్యై నమః
బ్రహ్మవిష్ణు
శివాత్మికాయై
త్రికాలజ్ఞానసంపన్నాయై
భువనేశ్వర్యైనమః

శ్రీ మహాలక్ష్మి అష్టోత్తర శతనామావళి సమాప్తం

## శ్రీ మహాలక్ష్మి వ్రత కథ మాహాత్మ్యము

ఓ భక్తులారా! శ్రీ మహాలక్ష్మి కథ చెప్తున్నాను భక్తి శ్రద్ధలతో వినండి. ఈ వ్రత కథ విన్నవారికి దుఃఖ దారిద్ర్యాలు తొలగి, దీర్ఘాయుష్షు ఆరోగ్యాది సంతతి లభించి మనసులోగల సకలకోరికలు తీరుటకు ఈ వ్రతాన్ని అందరు ఆచరించండి. మార్గశిరమాసం గురువారంనాడు శ్రీ మహా లక్ష్మి పూజ గావించి అనంతరం ఈ వ్రత కథను శ్రద్ధా భక్తులతో చేదువుకొని వినాలి.

శ్రీ మహాలక్ష్మి కథ ద్వాపర యుగంలో జరిగింది. సౌరాష్ట్ర అనే దేశాన్ని భద్రశ్రవ అనేరాజు రాజ్యాన్ని పాలిస్తూవుండేవాడు. ఆరాజు మహాపరాక్రమవంతుడే గాక విద్వాన్ వేదాంతుడు. అతని భార్యపేరు సురత్ చంద్రిక, ఆమెమంచి సౌందర్యవతే కాక గొప్ప పతివతగా పేరు

Hindupad.com www.hindupad.com

గాంచింది. ఆరాజు రాణికి ఎనమండుగురు సంతానం కలరు, వారిలో ఏడుగురు కుమారులు, ఒక కుమార్తె. కుమార్తె పేరు శ్యామబాల.

ఒకరోజు శ్రీమహాలక్ష్మి తన మనసులో ఇలా అనుకుంది. ఏమనగా నేను ఎప్పుడు ఆ రాజింట వెలసితినో అని మనసులో అనుకుంది. తాను రాజింట వెలసితే రాణే కాకుండా ప్రజలు కూడా భోగభాగ్యాదులతో సుఖసంపదలతో వర్ధిల్లుతారు. అదే ఒక దరిద్రుని ఇంట వెలసినచో ఆ కుటుంబమే భోగభాగ్యాదులతో వుండునని ఆ మహాలక్ష్మి ఒక వృద్ధ బ్రాహ్మణ స్త్రీ రూపం దాల్చి భద్రశ్రవ మహారాజు కోటద్వారం వద్దకు ప్రవేశించింది తన చేతిలో కర్రను కబ్బం చేసుకుంటూ సింహద్వారం వద్దకు ప్రవేశించింది. ఆమెను చూసి ఒకదాసిముందుకు వచ్చి నీవు ఎవరవు ? నీ పేరేమిటి ? నీ నివాసం ఎక్కడ? నీవుఎచటనుండి వచ్చితివి అనిఅడిగింది. అపుడు ఆవృద్ధబ్రాహ్మణ స్త్రీ రూపంలో నున్న మహాలక్ష్మి ఆ దాసినిగాంచి అమ్మా నాపేరు కమల్. నాభర్త పేరు భువనేశ్వర్. నేను ద్వారకలో నివాసం వుంటాను. విను; నీరాణి సురత్ చంద్రిక గత జన్మలో ఒక వైశ్యుని భార్య. ఆ వైశ్యుడుచాలా దారిద్ర్యంతో బాధపడుతూ వుండేవాడు. అందువలన ఆ భార్యాభర్తలకు నిరంతరము తగాదాలతో సంసారం సాగుతూ వుండేది.

ఒకనాడు ఆ వైశ్యుడు తన భార్యను గట్టిగాకొట్టాడు ఆ బాధ భరించలేక ఆమె ఇల్లువదలి అకలితో అడవికి

వెళ్ళింది ఆ వైశ్యుని భార్య. అలా నడుచుకుంటూ వెళుతుం డగా శ్రీ మహాలక్ష్మికి ఆమెపైజాలికలిగి ఆమె అడవికి ఏ కారణంచేత వచ్చెనో అడిగింది. దానికి ఆ వైశ్యుని భార్య గతం అంతా ఆమెకు చెప్పింది. అందుకు ఆ తల్లి ఆ వైశ్యుని భార్యకు శ్రీ మహాలక్ష్మి వ్రతం ఉపదేశించింది. అవైశ్యుని భార్య శ్రీమహాలక్ష్మి ఉపదేశించిన వ్రతం యధా ప్రకారం చేసింది. ఈ వ్రతం పూర్తయ్యే టప్పటికి ఆమెకు సకల సంప దలు వచ్చాయి. ఎన్నో సంవత్సరాలు ఆమె ఈ వ్రతం చేసింది ఈ వ్రతం చేసినన్నాళ్ళు వారు సుఖసంపదలతో వున్నారు.

ఈజన్మలో వారిరువురూ రాజు భద్రశ్రవగా రాణి సురత్ చంద్రికగా జన్మించారు. వారు ఈ భోగ భాగ్యా లలో మునిగిపోయి ఈ వ్రతం గురించి మరచిపోయారు. ఆ వ్రతంగుర్తుచేయడానికి నేనిక్కడకు వచ్చితినని చెప్పెను. మామ్మగారూ శ్రీ మహాలక్ష్మి వ్రతం ఎప్పుడు ఏవిధంగా ఎలా చేయవలెనో అని ఆదాసి చాలా శ్రద్ధగా అడిగింది.

ఆ వృద్ధ స్త్రీ శ్రీమహాలక్ష్మి వ్రతం ఎలా చేయవ లెనో వివరించింది. మార్గశిరమాసం మొదటి లక్ష్మీవారం నుండి శ్రీలక్ష్మీనారాయణుని పూజించి మంచి పక్వాన్నం నైవేద్యం పెట్టి ఓ మహాలక్ష్మీతల్లి ఈ రోజు నా యధాశక్తితో పూజచేస్తున్నాను ఇపుడు నువ్వు ప్రత్యక్షమవ్వు ఈవిధంగా లక్ష్మీదేవిని ప్రార్థించి నైవేద్యం పెట్టిన ప్రసాదం కొంచెం బ్రాహ్మణునికి పెట్టి మిగిలినది సకుటుంబం తినాలి మార్గ

శిరమాసం గురువారం ఈ ప్రకారం పూజ చేయాలి. ఆఖరి వారం బ్రాహ్మణునిచేత వ్రతం చెప్పించుకొని దక్షిణ తాంబూలం ఇవ్వాలి.

మామ్మగారు నావల్లమీకు ఆలస్యం అయ్యింది. ఆ దాసి వృద్ధస్త్రీకి సాష్టాంగ నమస్కారంచేసి మామ్మగారు నేను వెళ్లి రాణిగారిని తీసుకుని వస్తానని ఆ దాసి సురత్ చంద్రిక వద్దకు వెళ్ళింది. సురత్ చంద్రికతో ఆదాసి వృద్ధ స్త్రీ చెప్పిన పూర్వజన్మ వృత్తాంతం చెప్పింది. ఆ మాటలువిన్న సురత్ చంద్రిక వృద్ధ స్త్రీ నాకు చెప్పుట ఏమిటి? అని కోపంతో అంతఃపురం నుండి బయటకు వచ్చింది. ఐశ్వర్యంతో భోగభాగ్యాలలో మునిగిన ఆమె గర్వంతో బ్రాహ్మణ స్త్రీ వద్దకువచ్చి చాలా కోపంతో అమ్మా! గత జన్మ గా వృత్తాంతమంతా ఇపుడు జ్ఞాపకం చేస్తున్నావు ఇక్కడ నుండి వెడలిపో అని చేతిలో కర్రను లాక్కొని కాలితో తన్ని అవమానపరచింది.

దానికి ఆ స్త్రీ ఓ దుష్టురాలా రా మీరు దేనిగురించి ఇంత గర్వంతో మిడిసిపడుతున్నారు, అని ఆ వృద్ధస్త్రీ గట్టిగా గర్జించింది. నీవు నన్ను పొమ్మని చెప్పేదేమిటి? నీముందే నేను వెడలిపోతున్నాను. నీవునన్ను అవమానించావు. నేను వెళ్ళిన వెంటనే నీకు తెలిసివస్తుంది. నీవు నన్ను శపించడానికి నీవేమన్నా లక్ష్మిదేవి ననుకుంటున్నావా అని సురత్ చంద్రిక్ కోపంతో ఆ వృద్ధస్త్రీచేతిలో కర్ర తీసుకునిఅవతలకి త్రోసింది. లక్ష్మిదేవి లేచి నిలుచుని కుంటు కుంటూ మూలుగుతూ

Hindupad.com www.hindupad.com

వెళ్ళిపోయింది. దారిలో వెలుతుండగా శ్యామబాల నిలబడి ఉంది. మామ్మగారూ ఏమయింది మీకు అని అడిగింది. దానికి లక్ష్మీదేవి రాజకోటవద్ద జరిగినదంతా ఆరాజకుమారికి వివరించింది. మామ్మగారు జరిగినదానికి నేను క్షమాపణ కోరుతున్నాను. అని రెండు చేతులు జోడించి ఆవేశంతో అడిగింది. ఆమెపై లక్ష్మీదేవికి దయ కలిగింది. శ్యామబాలకు శ్రీమహాలక్ష్మి వ్రతం గురించి చెప్పింది. వ్రత విధానం చెప్పిన రోజే మార్గశిర మాసం మొదటి గురువారం. శ్యామ బాల చాలా భక్తి శ్రద్ధలతో ఆ వ్రతం చేసింది. సిద్ధేశ్వర్ అనే రాజుకు మాలాధర్ అనే కొడుకు కలడు. శ్యామబాలకు మాలాధర్‌కు వివాహం అయ్యింది. శ్యామబాల తనభర్తతో రాజవైభవముతో సిరి సంపదలతో తులతూగుతోంది. లక్ష్మీదేవి కోపగించివెళ్ళటంతో భద్రశ్రవరాజు సిరిసంపదలంతాపోయి వారికి దారిద్ర్యం పట్టుకుంది పూటకి తిండిలేక, ఒంటికి బట్టలేక చాలా దారిద్ర్యంతో బాధపడుతున్నారు. ఒకరోజు సురత్‌చంద్రిక ఆమె భర్తతో స్వామీ! దరిద్ర్యం వల్ల బ్రతక డం కష్టంగావుంది. మన అల్లుడు మాలాధర్ రాజుగా ఉన్నా డుకదా! మీరు వెళ్లి మన పరిస్థితి చెప్పండి. అతనికి తోచింది ఇస్తే తీసుకుని రండి. సురత్‌చంద్రిక అన్న మాటలకు భద్ర శ్రవకు నచ్చాయి. అతను అల్లుడి రాజ్యానికి పయన మయ్యాడు. అతడు దారిలో ఒక నదిఒడ్డున ఆగి విశ్రాంతి తీసుకున్నాడు. నీరు తీసుకుని పోవుటకు వచ్చిన శ్యామబాల దాసిలకు భద్రశ్రవ కనిపించాడు. ఆ దాసికి అతని ముఖం చూస్తే రాజులాగా, వేషం చూస్తే బికారిలాగా కనిపించి

Hindupad.com www.hindupad.com

మీరు ఎవరు ఎక్కడనుండి వచ్చారు? అని అడిగింది. దానికి అతడు ఒకప్పుడు నేను సౌరాష్ట్రదేశపురాజు భద్రశ్రవను. అని చాలాకష్టంతో అన్నాడు. నేను భద్రశ్రవరాజుని ఇప్పుడుబికారిగా అయిపోయాను. అని కష్టంమీద చెప్పినాడు అయ్యో! భగవంతుడా ఇతడు మా శ్యామబాల రాణిగారి తండ్రి అని పరుగు పరుగున వెళ్లి శ్యామబాలకు చెప్పింది. శ్యామబాల మేనక దాసీతో వస్త్రాలు, నగలు, ఒక గుర్రం ఇచ్చి తన తండ్రిని సకల మర్యాదలతో తీసుకురమ్మని ఆజ్ఞఇచ్చింది. శ్యామబాల తన తండ్రికి పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం పెట్టింది. సకల మర్యాదలు చేసింది. తండ్రి వెళ్ళేటప్పుడు ఒక బిందె నిండా ధనం ఇచ్చింది. ఆ రాజు ఆ బిందె నిండాధనం తీసుకుని తన దేశం వచ్చేశాడు. ఇదిగో నీకుమార్తె బిందెనిండా ధనం ఇచ్చిందని సురత్‌చంద్రికను పిలిచాడు. ఆమె ఆ బిందె మూత తీసి తొంగిచూచింది. సురత్‌చంద్రిక ముఖం నల్లబడింది. బిందెలోని ధనమంతా బొగ్గులుగా మారాయి లక్ష్మీదేవి కోపమువల్ల అలాజరిగింది. కొన్ని రోజుల తర్వాత సురత్‌చంద్రిక తన కూతురు యింటికి వెళ్లింది. ఆరోజు మార్గశిర మాసంలో మూడవ గురువారం అయిపోయి నాల్గవ గురువారం శ్యామబాల ప్రతి గురువారం ఏవిధంగా పూజచేసిందో ఆగురువారంకూడా అదేవిధంగా పూజచేసింది. తన తల్లిని ఎంతో బ్రతిమాలి ఆమెచేతకూడా ఈవ్రతం చేయించింది. వ్రతముయ్యాక తిరిగి తల్లిని పంపించింది. సురత్ చంద్రిక తన రాజ్యానికి వచ్చేటప్పటికి ఆమెకు పోయిన ఐశ్వర్యం అంతా వచ్చింది. శ్రీలక్ష్మీచరిత్రం

చేయటంవల్ల అలా జరిగింది. ఎన్నో రోజులు తర్వాత శ్యామబాల తన పుట్టింటికి వచ్చింది. తన కూతురు తండ్రికి ధనానికి బదులు బొగ్గులు ఇచ్చింది మనకేమీ ఇవ్వలేదన్న కోపం సురత్ చంద్రిక మనసులో పెట్టుకుంది శ్యామబాలను ఎలావున్నావని ఎవరూ అడగలేదు అందుకు ఆమెకు అవమానం అయింది. శ్యామబాల తన తల్లిపై కోపగించకుండా పుట్టింటినుండి చిటికెడు ఉప్పు తీసుకుని వెళ్ళింది నీ పుట్టింటు దగ్గరనుండి ఏమీ తీసుకు వచ్చావని మాలాధర్ అడిగాడు. రాజ్యసారం తీసుకువచ్చాననని నవ్వుతో చెప్పింది. ఏదిఎక్కడ రాజ్యసారం. ఆగండి కంగారు పడకండి అంది. ఆరోజు ఆమె ఏ పదార్థం వండినా అందులో ఉప్పు లేకుండా తయారు చేయించింది. మాలాధర్ భోజనంకు కూర్చున్నాడు. ఉప్పు లేకుండా చప్పగా అతనికి తినబుద్ధికావడం లేదు. ఆమె కంచంలోని పదార్థంలో కాస్తఉప్పు వేసింది. పదార్థంలో ఉప్పువేయటంతో ఎంతో రుచిగా వుంది. ఇదే నేను పుట్టింటి నుండి తీసుకువచ్చినరాజ్యసారంఅని భర్తకుచెప్పింది. శ్యామబాల భర్తకుఆమాట నచ్చింది. ఆ ఇద్దరు ఎంతో సంతోషంతో భోజనం చేశారు. ఈ విధంగా లక్ష్మీవ్రతం చేసుకున్న వారికి లక్ష్మీదేవి కటాక్షిస్తుంది. ఈవ్రతం చేసినవారికి సుఖ వైభవం, మనశ్శాంతి లభిస్తుంది. ఒక వేళ ధనం వచ్చినా గర్వం వుండకూడదు. లక్ష్మీవ్రతం చేయటం మర్చిపోకూడదు. ఆరాజు రాణిలాగే అందరూ సుఖంగా వుంటారు. ఈవ్రత కథ చదవకుండా వినకుండా చేసుకోకూడదు. చేసుకుంటే ఫలితం ఉండదు.

శ్రీ మహాలక్ష్మీ కథ, గురువారం కథ సంపూర్ణం.

ఓం శాంతి శాంతి శాంతిః

Hindupad.com www.hindupad.com

నమస్తేస్తు మహామాయే శ్రీ పీఠే సురపూజితే
శంకచక్ర గదాహస్తే మహాలక్ష్మి నమోస్తుతే
మనోరమ భగవతీ లక్ష్మీచ పద్మావతి అన్నపూర్ణేశ్వరి
హే గజలక్ష్మీమాతా॥ హే ఆదిలక్ష్మీమాతా ॥
హే విజయలక్ష్మీ మాతా ॥ హేఐశ్వర్యలక్ష్మీమాతా॥
హే వరలక్ష్మీమాతా॥ హే ధాన్యలక్ష్మీమాతా॥
హే సంతాన లక్ష్మీమాతా ॥ హే సౌభాగ్య లక్ష్మీమాత
హే అన్నపూర్ణేశ్వరీ భగవతీ మా రక్షమాం రక్షమాం రక్ష.

—00—

## మంగళ హారతి

1) దుర్గేదుర్గట్ భారి తుజవిన్ సంసారి ॥
అనాత్ నాద్ అంబె కరుణ విస్తారి ॥
వారి వారి జన్మ మరణాతె వారి।
హరి పడలె ఆత సంకట్ నివారి ।జయ।

2) జయదేవి జయదేవి జయమహిషాసురమర్దిని॥
సురవర్ ఈశ్వరదే తారక్ సంజీవిని ।
త్రిభువనభువని పహాత్ తుజ్ ఐసి నాహి ॥
చారి శ్రమలె పరంతున్ నబోలా వె కాహి ।
సాహి వివాద్ కరిత పడిలే ప్రవాహి ।
తే తు భక్తలాగి పావసి లవలాహి ॥జయ।

3) ప్రసన్న వదనే ప్రసన్న హోతి నిజదాస॥
క్లేశిపాశుని సోడి తోడి భవపాశ
అంబే తుజవాచున్ కోన్ పురవిల్ ఆశ ।
నరహరి తల్లిన్ ఝాలపద పంకజ లేశ ॥జయ॥